# వినాయక వ్రతకల్పము



రి.నెం.246/2019

# హైందవశక్తి

ధర్మరక్షణ దేశరక్షణే మా ధ్యేయం


ఉపాధ్యక్షులు
పసల సందీప్
సెల్ : 9948476363

కృష్ణాజిల్లా అధ్యక్షులు
కోనేరు ప్రదీప్
సెల్ : 7989992621

మహిళా విభాగ అధ్యక్షురాలు
కొత్తూరు ప్రసన్న
సెల్ : 9949974592




ఈ పుస్తక ప్రచురణకు తనవంతు సహకరించినవారు

# శ్రీ పాపట్ల రాధాకృష్ణమూర్తి గారు

శ్రీ వత్సవ గోత్రం, విజయవాడ-1

శ్రీరస్తు అవిఘ్నమస్తు శుభమస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః శ్రీ మహాసరస్వత్యై నమః శ్రీ గురుభ్యోనమః

## పూజకు కావాల్సిన సామాగ్రి

మామిడాకులు తోరణాలు కట్టి ఇంటిని అలంకరించాలి. రాగి లేదా ఇత్తడి పాత్ర, జాకెట్టు, కొబ్బరికాయ, (కలశానికి), పీట, దారపు ఉండ, పాలవెల్లి, మామిడాకులు, పసుపు, కుంకుమ, గంధం, అగరవత్తులు, కర్పూరం, తమలపాకులు-25, వక్కలు, పూలమాల, విడి పూలు, అరటిపండ్లు-12, కొబ్బరికాయలు-3, బెల్లం, తోరం, కుందులు, ఆవు నెయ్యి, నూనె, వత్తులు, ఉద్ధరిణ, నైవేద్యాలు, 21 రకాల పత్రి, మట్టి వినాయకుని ప్రతిమ, అక్షింతలు, బియ్యం, రూపాయి నాణేలు-5, పత్తితో చేసిన మాలలు 3- అంగుళాల చొప్పున-6, సిద్ధం చేసుకోవలసిన నైవేద్య పదార్థాలు...

**ప్రసాదములు :** చలివిడి, వడపప్పు, పానకం, క్షీరాన్నం, పులిహోర, పూర్ణములు, జున్ను, కుడుములు.

ఓ పీటకు పసుపు రాసి ఇంటికి ఈశాన్య భాగంలో లేదా ఉత్తర దిక్కులో ఉంచాలి. పీటపై వినాయక ప్రతిమను ఉంచి, పాలవెల్లికి పసుపు రాసి, కుంకుమతో బొట్టు పెట్టి విగ్రహం తలపై వచ్చేలా దాన్ని వేలాడదీయాలి. దీని పై పత్రి వేసి నలువైపులా మొక్కజొన్న పొత్తులు, పూలు, పళ్లతో అలంకరించాలి.

**పూజా విధానం :** అగరువత్తులు వెలిగించి, దీపారాధన చేయాలి.

*(నమస్కరిస్తూ, ఈ క్రింది శ్లోకాలను చెప్పాలి)*

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం । ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥
అగజానన పద్మార్కం గజానన మహర్నిశం । అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే ॥

సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః । లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ॥
ధూమకేతు: గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః । ద్వాదశైతానినామాని యః పఠేచ్ఛృణుయాదపి ॥

విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా । సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే ॥
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజతో యస్సురైరపి । సర్వవిఘ్నచ్ఛిదే త స్మైశ్రీ గణాధిపతయే నమః ॥

ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం । కుర్వే ఘంటారావం తత్ర దేవతాహ్వాన లాంఛనం ॥

*గంట కొట్టవలెను....*

*నమస్కరిస్తూ చెప్పాలి.......*

గణానాం త్వా గణపతిగ్ ం హవామహే! కవిం కవీనా ముపవశ్రవస్తవం,
జ్యేష్ఠ రాజం, బ్రహ్మణాం బ్రాహ్మణస్పత ఆ నః శ్రుణ్వత్ న్నూతిభిస్సీద సాదనం !
ఓం శ్రీ మహా గణపతయే నమః ఓం శ్రీ మహా సరస్వత్యై నమః శ్రీ గురుభ్యో నమః హరిః ఓం.

ఓం శ్రీలక్ష్మీ నారాయణాభ్యాం నమః - ఓం ఉమామహేశ్వరాభ్యాం నమః -
ఓం వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః - ఓం శచీపురందరాభ్యాం నమః -
ఓం అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః - ఓం శ్రీ సీతారామాభ్యాం నమః

నమస్సర్వేభ్యో మహాజనేభ్యః అయం ముహూర్త స్సుముహూర్తోస్తు, అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతో పివా యః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాంభ్యంతరస్సుచిః !!

*ఉద్ధరిణలోని నీటిని, బొటన వ్రేలితో శిరస్సు పై చల్లుకొన వలెను.*

**ఆచమనము :** ఓం కేశవాయ స్వాహాః - ఓం నారాయణాయ స్వాహాః - ఓం మాధవాయ స్వాహాః

*అని మూడుసార్లు చేతిలో నీరు వేసుకొని ఆచమనం చేసుకోవాలి. (నీరు త్రాగాలి)*

*అనంతరం నమస్కరిస్తూ ఈ క్రింది మంత్రాలను చెప్పాలి.*

గోవిందాయ నమః – విష్ణవే నమః – మధుసూదనాయ నమః – త్రివిక్రమాయ నమః – వామనాయ నమః – శ్రీధరాయ నమః – హృషీకేశాయ నమః – పద్మనాభాయ నమః – దామోదరాయ నమః – సంకర్షణాయ నమః – వాసుదేవాయ నమః – ప్రద్యుమ్నాయ నమః – అనిరుద్ధాయ నమః – పురుషోత్తమాయ నమః అధోక్షజాయ నమః – నారసింహాయ నమః – అచ్యుతాయ నమః ఉపేంద్రాయ నమః – హరయే నమః – శ్రీ కృష్ణాయ నమః – శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

**భూతోచ్చాటన :** ఉత్తిష్టంతు భూతపిశాచాః – ఏతే భూమి భారకాః – ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే
*మంత్రాన్ని చదువుతూ అక్షతలు తలపై నుంచి వెనుక వేసుకోవాలి.*

**ప్రాణాయామం : –** ఓం భూః – ఓం భువః – ఓగ్ సువః – ఓం మహః ఓం జనః – ఓం తపః – ఓం సత్యం – ఓం తత్సవితుర్వరేణ్యం – భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥ – ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్

**సంకల్పం *(నమస్కరిస్తూ చెప్పాలి)* :** మమోపాత్త సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వన్తరే – కలియుగే – ప్రథమపాదే – జంబూద్వీపే – భరతవర్షే – భరతఖండే – మేరోర్దక్షిణ దిగ్భాగే – శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే – కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే – శోభనగృహే – సమస్త దేవతా గో బ్రాహ్మణ హరి హర గురుచరణ సన్నిధౌ – అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాన్ద్రమానేన శ్రీ ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే శ్రీ ................ సంవత్స దక్షిణాయనే వర్షఋతౌ భాద్రపదమాసే శుక్లపక్షే చతుర్థ్యాం తిథౌ................ వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ గోత్రః ..................... నామధేయస్య .................. ధర్మపత్నీ సమేతః శ్రీ మతః గోత్రస్య – నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య । సహకుటుంబస్య, క్షేమ స్థైర్య ధైర్య విజయాయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం పుత్ర పౌత్రాభి వృద్ధ్యర్థం సర్వాభీష్ట సిద్ధ్యర్థం సకల విద్యా ప్రాప్యర్థం సమస్త మంగళావాప్యర్థం సమస్త దురితోప శాంత్యర్థం వర్షే వర్షే ప్రయుక్త శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ముద్దిశ్య శ్రీ వరసిద్ధి వినాయక దేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం హరిద్రా బింబే – శ్రీమహాగణాధిపతి దేవతా పూజాఙ్కరిష్యే ।
*అంటూ కుడిచేయి ఉంగరం వేలితో నీళ్లు ముట్టుకోవాలి.*

**కలశపూజ :** గంధ పుష్పాక్షతైర్చ్య । కలశే ఉదకం పూరయిత్వా । తస్యోపరి హస్తం నిధాయ ।

*కలశ పాత్రను తీసుకుని పసుపు రాసి, అందులో నీళ్లుపోసి, పైన టెంకాయ, జాకెట్టు ఉంచి కలశం ఏర్పాటు చేయాలి.*

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః । మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్మృతాః ॥
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసున్దరా । ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ॥
*అని, కలశములో పూలు, అక్షింతలు వేయాలి.*

శ్లో॥ గంగేచ యమునే కృష్ణ గోదావరి సరస్వతి । నర్మదే సిన్ధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥
కావేరీ తుంగభద్రాచ కృష్ణవేణీచ గౌతమీ । భాగీరథీచ విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః

ఆయాస్తు – శ్రీమహా గణాధిపతి దేవతా పూజార్థం దురితక్షయకారకాః
కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య – దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య
తదఙ్గ శ్రీ మహాగణాధిపతి దేవతా ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే ॥

*అంటూ, అన్ని పూజా ద్రవ్యములపైన, పూజ చేస్తున్న అందరిపై కలశములోని నీరు చల్లవలెను.*

అదౌ నిర్విఘ్ను పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే.

*పసుపుతో గణపతిని చేసి, తమలపాకు పై ఉంచవలెను.*

### ఓం శ్రీ మహా గణపతయే నమః

**ధ్యాయామి :–** ధ్యానం సమర్పయామి *అని, నమస్కారము చేయవలెను*
**ఆవాహయామి :–** ఆసనం సమర్పయామి *అని, తమలపాకును తాకవలెను*
**హస్తయో :–** అర్ఘ్యం సమర్పయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*
**పాదయో :–** పాద్యం సమర్పయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*
ఔపచారిక స్నానం సమర్పయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*
స్నానానంతరం ఆచమనం సమర్పయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*
వస్త్రం సమర్పయామి *అని, పత్తి మాలను పసుపు గణపతి పై ఉంచవలెను*
ఉపవీతం సమర్పయామి *అని, పత్తి మాలను పసుపు గణపతిపై ఉంచవలెను*
గంధాన్ ధారయామి *అని, గంధమును పసుపు గణపతికి గంధము పూయవలెను*
గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి *అని, పసుపు గణపతిపై అక్షింతలు వేయవలెను*

## పుష్పైః పూజయామి *(నమః అన్నప్పుడల్లా, పసుపు గణపతికి ..... ఒక పువ్వు సమర్పించాలి)*

ఓం సుముఖాయ నమః ఓం ఏక దంతాయ నమ: ఓం కపిలాయ నమః –
ఓం గజకర్ణికాయ నమః – ఓం లంబోదరాయ నమః – ఓం వికటాయ నమ:
ఓం విఘ్నరాజాయ నమః – ఓం గణాధిపాయ నమః – ఓం ధూమకేతవే నమః
ఓం గణాధ్యక్షాయ నమః – ఓం ఫాలచంద్రాయ నమ: ఓం గజాననాయ నమ:
ఓం వక్రతుండాయ నమః – ఓం శూర్పకర్ణాయ నమః – ఓం హేరంబాయ నమః
ఓం స్కంద పూర్వజాయ నమః – ఓం మహా గణపతయే నమః

నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి.
ధూపమాఘ్రాపయామి *అగరుబత్తులు వెలిగించి, దేవునికి చూపాలి*
దీపం దర్శయామి *దీపం దేవునికి చూపాలి*
ధూప దీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి
*ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*

నైవేద్యం సమర్పయామి *కొబ్బరికాయ కొట్టి, బెల్లం, కొబ్బరి నీళ్ళు, చిప్పలు నైవేద్యం పెట్టాలి*

## నైవేద్యం పెట్టు విధానము

ఓం భూర్భు వస్సువః తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ !!
*అని, పదార్థముల పై నీళ్ళు చల్లవలెను*
సత్యం త్వర్తేన పరిషించామి *అని, నైవేద్యం పదార్థాల చుట్టూ నీళ్ళు ధారగా వదలాలి*
అమృతమస్తు – అమృతోపస్తరణమసి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*

ఓం ప్రాణాయ స్వాహా ! ఓం ఆపానాయ స్వాహా ! ఓం వ్యానాయ స్వాహా !
ఓం ఉదానాయ స్వాహా ! ఓం సమానాయ స్వాహా! ఓం బ్రహ్మణ్యే స్వాహా !

*అని అంటూ, '6' మార్లు నైవేద్యం పదార్థాలను దేవునికి సమర్పించాలి*

అమృతమస్తు అమృతోపస్తరణమసి *అని ఉద్ధరిణతో నీటని గణపతికి చూపించి పళ్ళెం లో వదలాలి*

ఓం ప్రాణాయ స్వాహా ఓం ఆపానాయ స్వాహా ఓం వ్యానాయ స్వాహా ఓం ఉదానాయ స్వాహా
ఓం నామానాయ స్వాహా ఓం బ్రహ్మణ్యే స్వాహా

*అని అంటూ 6 మార్లు నైవేద్యం పదార్థాలను దేవునికి సమర్పించ్చాలి*

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*

హస్తౌ ప్రక్షాళయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*
పాదౌ ప్రక్షాళయామి *అని, ఉద్ధరిణెతో నీళ్ళు గణపతికి చూపించి పళ్ళెంలో వదలాలి*

పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం, కర్పూర చూర్ణసంయుక్తం తాబూలం ప్రతిగృహ్యతాం ! తాంబూలం సమర్పయామి అని తాంబూలం (తమలపాకులు, అరటి పళ్ళు, వక్క) సమర్పించాలి.
ఘృతవర్తి సహస్త్రైశ్చ శకలైస్థితం నీరాజనం మయాదత్తం గృహాణవరదోభవ ! నీరాజనం సమర్పయామి ... *అని హారతి ఇవ్వాలి*

## నమస్కారం చేస్తూ....

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ । నిర్విఘ్నం కురుమేదేవ సర్వ కార్యేషు సర్వదా ॥
మహా గణపతయే నమ: ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ! –
*అని చెప్పి, నిలబడి, నమస్కారం చేస్తూ ఆత్మ ప్రదక్షిణ చేయాలి*

అకాల మృత్యు హరణం సర్వ వ్యాధి నివారణం ।
సమస్త పాపక్షయకరం శ్రీ మహా గణపతి పాదోదకం పావనం శుభం ॥ *అని చెప్పి, తీర్థం స్వీకరించాలి*

గణాధిపతిః సుప్రీత సుప్రసన్నో వరదో భవతు !
మమ ఇష్ట కామ్యార్థ ఫలసిధ్యర్థం గణాధిపతి ప్రసాదం శిరసా గృష్ణమి. *అని చెప్పి, ప్రసాదం స్వీకరించాలి.*

ఓం శ్రీ మహా గణపతయే నమః యథాస్థానం ఉద్వాసయామి । శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ ॥
ఓం ఓం యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః । తాని ధర్మాణి ప్రధమాన్యాసన్ ॥
తే హ నాకం మహిమాన: సచంతే । యాత్ర పూర్వే సాధ్యాః సంతిదేవాః ॥
*అని చెప్పి, పసుపు గణపతి ఉన్న తమలపాకును కొంచెం జరపాలి.*

## అథాంగ పూజ

ఓం గణేశాయ నమః పాదౌ పూజయామి – ఓం ఏకదంతాయ నమః గుల్ఫౌ పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః జానుని పూజయామి – ఓం విఘ్నరాజాయ నమః జంఘే పూజయామి
ఓం ఆఖువాహనాయ నమః ఊరూ పూజయామి – ఓం హేరంబాయ నమః కటిం పూజయామి
ఓం లంబోదరాయ నమః ఉదరం పూజయామి – ఓం శ్రీ గణనాథాయ నమః నాభిం పూజయామి
ఓం శ్రీ గణేశాయ నమః హృదయం పూజయామి – ఓం స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి
ఓం శ్రీ స్కందాగ్రజా నమః స్కందౌ పూజయామి – ఓం శ్రీ పాశహస్తాయ నమః హస్తా పూజయామి
ఓం గజవక్త్రయ నమః వక్త్రం పూజయామి – ఓం విఘ్నహంత్రే నమః నేత్రా పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః కర్ణా పూజయామి – ఓం ఫాలచంద్రాయ నమః లలాటం పూజయామి
ఓం సర్వేశ్వరాయ నమః శిరః పూజయామి – ఓం విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి.

## అథ ఏకవింశతి పత్ర పూజ

*(పై మంత్రములు చదువుచూ తదేక ధ్యానముతో 21 పత్రములతో గరికతో అర్చించవలెను)*

| | | |
|---|---|---|
| ఓం సుముఖాయ నమః | మాచీపత్రం | పూజయామి (మాచీపత్రం) |
| ఓం గణాధిపాయ నమః | బృహతీపత్రం | పూజయామి (నేలమునగ ఆకు) |
| ఓం ఉమాపుత్రాయ నమః | బిల్వపత్రం | పూజయామి (మారేడు ఆకు) |
| ఓం గజాననాయ నమః | దూర్వాయుగ్మ పత్రం | పూజయామి (గరిక) |
| ఓం హరసూనవే నమః | దత్తూర పత్రం | పూజయామి (ఉమ్మెత్త) |
| ఓం లంబోదరాయ నమః | బదరీపత్రం | పూజయామి (రేగు ఆకు) |
| ఓం గుహాగ్రజాయ నమః | అపామార్గపత్రం | పూజయామి (ఉత్తరేణి) |

| | | |
|---|---|---|
| ఓం గజకర్ణాయ నమః | తులసీపత్రం | పూజయామి (తులసి) |
| ఓం ఏకదంతాయ నమః | చూతపత్రం | పూజయామి (మామిడి) |
| ఓం వికటాయ నమః | కరవీర పత్రం | పూజయామి (గన్నేరు) |
| ఓం భిన్నదంతాయ నమః | విష్ణుక్రాంతపత్రం | పూజయామి (హరిక్రాంత ఆకు) |
| ఓం వటవే నమః | దాడిమీపత్రం | పూజయామి (దానిమ్మ) |
| ఓం సర్వేశ్వరాయ నమః | దేవదారుపత్రం | పూజయామి (దేవదారు) |
| ఓం ఫాలచంద్రాయ నమః | మరువకపత్రం | పూజయామి (మరువక) |
| ఓం హేరంబాయ నమః | సింధువారపత్రం | పూజయామి (వావిలాకు) |
| ఓం శూర్పకర్ణాయ నమః | జాజీపత్రం | పూజయామి (జాజి) |
| ఓం సురాగ్రజాయ నమః | గండకీపత్రం | పూజయామి (తీగగరిక) |
| ఓం ఇభవక్త్రాయ నమః | శమీ పత్రం | పూజయామి (జమ్మి) |
| ఓం వినాయకాయ నమః | అశ్వత్థపత్రం | పూజయామి (రావి) |
| ఓం సురసేవితాయ నమః | అర్జునపత్రం | పూజయామి (మద్ది ఆకు) |
| ఓం కపిలాయ నమః | అర్కపత్రం | పూజయామి (జిల్లేడు) |
| ఓం గణేశ్వరాయ నమః | ఏకవింశతిపత్రాణి | పూజయామి |

## అథ దూర్వాయుగ్మ పూజ

| | | |
|---|---|---|
| గణాధిపాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఉమాపుత్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఆఖువాహనాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| వినాయకాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఈశపుత్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| సర్వసిద్ధిప్రదాయకాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఏకదంతాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| ఇభవక్త్రాయ నమః | దూర్వాయుగ్మం | పూజయామి |
| మూషికవాహనాయ నమః | దూర్వాయుగ్మ | పూజయామి |
| కుమారగురవే నమః | దూర్వాయుగ్మం | పూజయామి |

## గణేశ ప్రార్థన

ఉ. తుండము నేకదంతము దోరపు బొజ్జయు వామ హస్తమున్
మెండుగ మ్రోయు గజ్జలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్!

చ. తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటి నందన నీకు మ్రొక్కెదన్
ఫలితము సేయవయ్య నిను ప్రార్థన జేసెద నేకదంత నా
వలపలిచేత ఘంటమున వాక్కున నెప్పుడు బాయకుండుమీ
తలపున నిన్ను వేడెదను దైవగణాధిప ! లోకనాయకా !

క. తలచితి నే గణనాధుని తలచితినే విఘ్నపతిని దలచిన పనిగా
దలచితినే హేరంబుని దలచితి నా విఘ్నములను తొలగించుటకున్ !

క. అటుకులు కొబ్బరిపలుకులు చిటిబెల్లము నానుబ్రాలు చెరకు రసంబున్
నిటలాక్షు నగ్రసుతునకు బటుతరముగ విందు సేతు బ్రార్థింతు మదిన్!

# శ్రీ వినాయక అష్టోత్తర శతనామావళి

ఓం గజాననాయ నమః
ఓం గణాధ్యక్షాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం వినాయకాయ నమః
ఓం ద్వైమాతురాయ నమః
ఓం ద్విముఖాయ నమః
ఓం ప్రముఖాయ నమః
ఓం సుముఖాయ నమః
ఓం కృతినే నమః
ఓం సుప్రదీప్తాయ నమః
ఓం సుఖనిధయే నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం సురారిఘ్నాయ నమః
ఓం మహాగణపతయే నమః
ఓం మాన్యాయ నమః
ఓం మహాకాలాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం హేరంబాయ నమః
ఓం లంబజఠరాయ నమః
ఓం హయగ్రీవాయ నమః
ఓం ప్రథమాయ నమః
ఓం ప్రాజ్ఞాయ నమః
ఓం ప్రమోదాయ నమః
ఓం మోదకప్రియాయ నమః
ఓం విఘ్నకర్త్రే నమః
ఓం విఘ్నహంత్రే నమః
ఓం విశ్వనేత్రే నమః
ఓం విరాట్పతయే నమః
ఓం శ్రీపతయే నమః
ఓం వాక్పతయే నమః
ఓం శృంగారిణే నమః
ఓం ఆశ్రితవత్సలాయ నమః
ఓం శివప్రియాయ నమః
ఓం శీఘ్రకారిణే నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం బల్వాన్వితాయ నమః
ఓం బలోద్ధతాయ నమః
ఓం భక్తనిధయే నమః
ఓం భావగమ్యాయ నమః
ఓం భావాత్మజాయ నమః
ఓం అగ్రగామినే నమః
ఓం మంత్రకృతే నమః
ఓం చామీకర ప్రభాయ నమః
ఓం సర్వాయ నమః
ఓం సర్వోపాస్యాయ నమః
ఓం సర్వకర్త్రే నమః
ఓం సర్వ నేత్రే నమః
ఓం సర్వసిద్ధిప్రదాయ నమః
ఓం పంచహస్తాయ నమః
ఓం పార్వతీనందనాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం కుమార గురవే నమః
ఓం కుంజరాసురభంజనాయ నమః
ఓం కాంతిమతే నమః
ఓం ధృతిమతే నమః
ఓం కామినే నమః
ఓం కపిత్థఫలప్రియాయ నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం బ్రహ్మరూపిణే నమః
ఓం మహోదరాయ నమః
ఓం మదోత్కటాయ నమః
ఓం మహావీరాయ నమః
ఓం మంత్రిణే నమః
ఓం మంగళసుస్వరాయ నమః
ఓం ప్రమదాయ నమః
ఓం జ్యాయసే నమః
ఓం యక్షికిన్నరసేవితాయ నమః
ఓం గంగాసుతాయ నమః
ఓం గణాధీశాయ నమః
ఓం గంభీరనినదాయ నమః
ఓం వటవే నమః
ఓం జ్యోతిషే నమః
ఓం అక్రాంతపదచిత్ప్రభవే నమః
ఓం అభీష్టవరదాయ నమః
ఓం మంగళప్రదాయ నమః
ఓం అవ్యక్త రూపాయ నమః
ఓం పురాణపురుషాయ నమః
ఓం పూష్ణే నమః
ఓం పుష్కరోత్ క్షిప్తహరణాయ నమః
ఓం అగ్రగణ్యాయ నమః
ఓం అగ్రపూజ్యాయ నమః
ఓం అపాకృతపరాక్రమాయ నమః
ఓం సత్యధర్మిణే నమః
ఓం సఖ్యే నమః
ఓం సారాయ నమః
ఓం సరసాంబునిధయే నమః
ఓం మహేశాయ నమః
ఓం విశదాంగాయ నమః
ఓం మణికింకిణీ మేఖలాయ నమః
ఓం సమస్తదేవతామూర్తయే నమః
ఓం సహిష్ణవే నమః
ఓం బ్రహ్మవిద్యాది దానభువే నమః
ఓం విష్ణవే నమః
ఓం విష్ణుప్రియాయ నమః
ఓం భక్తజీవితాయ నమః
ఓం ఐశ్వర్యకారణాయ నమః
ఓం సతతోత్థితాయ నమః
ఓం విష్వగ్దృశేనమః
ఓం విశ్వరక్షావిధానకృతే నమః
ఓం కళ్యాణగురవే నమః
ఓం ఉన్మత్తవేషాయ నమః
ఓం పరజయినే నమః
ఓం సమస్త జగధాదరాయ నమః
ఓం సర్వైశ్వర్యప్రదాయ నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః

నానావిధ పరిమళ
పత్రపుష్పాక్షతాన్ సమర్పయామి
(పూలు అక్షతలు వినాయకుడి
మీద వేయాలి)

# విఘ్నేశ్వరుని వ్రతకథ

***వినాయక వ్రత కథ చదివేవారు, పూజలో కూర్చునేవారు ముందు చేతిలో కొద్దిగా అక్షింతలు ఉంచుకోవాలి. కథ పూర్తయిన తర్వాత వాటిని తమ శిరస్సుపై ధరించాలి.***

సూతమహాముని శౌనకాది మునులకు విఘ్నేశ్వరోత్పత్తియు, చంద్రదర్శన దోష కారణంబును తన్నివారణంబును చెప్పదొడంగెను.



పూర్వకాలమున గజముఖుడయిన గజాననుడు అనే రాక్షసుడు శివుని గూర్చి ఘోర తపఃబొనర్చెను. అతని తపస్సునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై "వరము కోరుకో"మనెను. అంత గజాసురుండు పరమేశ్వరుని స్తుతించి, "స్వామీ నీవు ఎల్లప్పుడూ నా యుదరయందే నివసించవలె"నని కోరెను. దానితో భక్తసులభుండగు శివుడు అతని కోర్కెదీర్చి కుక్షియందుం డిపోయాడు. కైలాసమున జగన్మాత పార్వతి భర్త జాడ తెలియక పలు తెరంగులనన్వేషించుచూ ఆయన గజాసురుని యుదరములో వుండునని తెలుసుకున్నది. ఆయనను దక్కించుకొనే ఉపాయం గానక పరితపించుచు విష్ణుమూర్తిని ప్రార్థించి తన పతివృత్తాంతము తెలిపి "మహాత్మా! నీవు పూర్వము భస్మాసురుని బారి నుండి నా పతిని రక్షించి నాకు యొసంగితివి. ఇప్పుడు కూడనూ నుపాయాంతరముచే నా పతిని రక్షింపు"మని విలపించినది. అంత శ్రీహరి బ్రహ్మాది దేవతలను పిలిపించి గజాసుర సంహారమునకు 'గంగిరెద్దు మేళమే' యుక్తమని నిశ్చయించి, నందీశ్వరుని గంగిరెద్దుగా అలంకరించి, బ్రహ్మాది దేవతలందరిచే తలకొక వాయిద్యమును ధరింపజేశాడు. మహావిష్ణువు తానునూ చిరుగంటలు, సన్నాయిలు ధరించి గజాసుర పురంబునకు వెళ్ళి జగన్మోహనంబుగా గంగిరెద్దులను ఆడించుచుండగా గజాసురుడది విని, వారలను పిలిపించి తన భవనము ఎదుట గంగిరెద్దులను ఆడించమని కోరాడు. బ్రహ్మాది దేవతలు రసరమ్యంగా వాద్యాల జోరు సలుప జగన్నాటక సూత్రధారియగు నాహరి చిత్రవిచిత్రకరంబుగ గంగిరెద్దునాడించాడు. గజాసురుడు పరమానందభరితుడై "మీకేమికావలయునో కోరుడొసంగెద"ననెను. అంతట శ్రీహరి గజాసురుని సమీపించి "ఇది శివుని వాహనమగు నంది, శివుని కనుగొనుటకు వచ్చె, కావున శివునొసంగు" మనెను. ఆ మాటలకు గజాసురుడు నివెవ్వరపోయి, వచ్చినవాడు అతనిని రాక్షసాంతకుడగు శ్రీహరి అని నెఱింగి, తనకు మరణమే నిశ్చయమను కున్నాడు. తన గర్భస్తుండగు పరమేశ్వరుడ్ని "స్వామీ! నా శిరస్సు త్రిలోక పూజ్యముగజేసి, నా చర్మము నీవు ధరించు"మని ప్రార్థించెను. విష్ణుమూర్తికి అంగీకారము తెలుపగా శ్రీహరి నందిని ప్రేరేపించగా, నంది తన కొమ్ములతో గజాసురుని చీల్చి సంహరించెను. అంత మహేశ్వరుడు గజాసుర గర్భమునుండి బహిర్గతుడై విష్ణుమూర్తిని స్తుతించాడు. అంత నాహరి "దుష్టాత్ములకిట్టి వరంబులీయరాదు, ఇచ్చినచో పామునకు పాలుపోసినట్లగు"నని ఉపదేశించాడు. బ్రహ్మాది దేవతలకు వీడ్కోలు చెప్పి శ్రీహరి వైకుంఠమునకు కేగెను. శివుడు నందినెక్కి కైలాసమునకు జనియో.

# వినాయకోత్పత్తి

కైలాసంలో పార్వతీదేవి భర్త రాకను దేవాదుల వలన విని అభ్యంగనస్నాన మాచరించుచు నలుగుబిండి నొక పరధ్యానమున నొక ప్రతిమనుజేసినది. అంత ప్రతిమ చూడముచ్చటగాగుపించెను.

ప్రాణం పోయాలని పించి, తన తండ్రి ద్వారా పొందిన మంత్రంతో ఆ ప్రతిమకు ప్రాణ ప్రతిష్ఠ చేసినది. ఆ దివ్యసుందరుణ్ణి వాకిలి ద్వారమున కాపుగా ఉంచెను. స్నానాంతరము పార్వతి సర్వాభరణముల నలంకరించుకొనుచూ పత్యాగమనమునకు నిరీక్షించుచుండె. అప్పుడు పరమేశ్వరుడు నంది నారోహించి వచ్చి లోపలికి పోబోవగా వాకిలి ద్వారమున నున్న బాలుడడ్డగించెను. శివుడు కోపించి త్రిశూలముతో బాలుని కంఠంబుదునిమి లోనికేగెను.



అంత పార్వతీదేవి భర్తనుగాంచి ఎదురేగి అర్ఘ్యపాద్యాదులచే పూజించె. వారిరువురూ పరమానందమున ప్రియాభాషణములు ముచ్చటించుచుండ ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చె. అంత నమ్మ మహేశ్వరుండు తానొనరించిన పనికి చింతించి తాను తెచ్చిన గజాసుర శిరంబు నా బాలునికతికించి ప్రాణంబు నొసంగిః "గజాననుడు" అని నామం బొనగె. అతనిని పుత్ర ప్రేమం బున ఉమామహేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాన నుడు తల్లిదండ్రులను పరమభక్తితో సేవించుచుండెను. ఇతడు సులభముగా ఎక్కి తిరుగుటకు ఆనంద్యుడను నొక ఎలుకరాజును వాహనము గా జేసికొనియె. కొంతకాలము నకు పార్వతీపరమేశ్వరులకు కుమారస్వామి జన్మించెను. అతడు మహాబలశాలి. అతని వాహనరాజు నెమలి. అతడు దేవతల సేనా నాయకుడై ప్రఖ్యాతిగాంచియుండెను.



# శ్రీ విఘ్నేశాధిపత్యము

ఒకనాడు దేవతలు, మునులు, పరమేశ్వరుని సేవించుచు విఘ్నములకొక్కని అధిపతిగా తమ కొసంగుమని కోరిరి. గజాననుడు "తాను జ్యేష్ఠుడను గనుక ఆ యాధిపత్యము తన కొసంగుమనియు", "గజాననుడు మరుగుజ్జువాడు అనర్హుడు అసమర్థుడుగాన ఇయ్యధిపత్యము తనకొసంగె మని కుమారస్వామియు తండ్రిని వేడుకొనిరి. శివుండక్కుమారులను జూచి "మీలో నెవ్వరు ముల్లోకములందలి పుణ్యనదులలో స్నానమాడి ముందుగా నా యొద్దకు వచ్చెదరో, వారికీ యాధిపత్యంబొసంగుదు"నని మహేశ్వరుండు పలుక, వెల్లయని సమ్మతించ కుమారస్వామి నెమలి వాహనంబు నెక్కి

వాయువేగంబుననేగె. అంత గజాననుడు ఖిన్నుడై తండ్రిని సమీపించి ప్రణమిల్లి "అయ్యా, నా అసమర్థత తామెరింగియు నిట్లానతీయదగునే, మీ పాద సేవకుడను, నా యందు కటాక్షముంచి తగునుపాయంబు దెల్పి రక్షింపవే"యని ప్రార్థింప మహేశ్వరుడు దయాళుడై సుకృత్ నారాయణేత్యుక్త్వాపుమాత్ కల్ప శతత్రయం గంగాది సర్వతీర్థేషు స్నాతోభవతి పుత్రక "కుమార! ఒకసారి నారాయణ మంత్రంబు పఠించు" మనగా గజాననుడు సంతసించి అత్యంత భక్తితో నమంత్రంబు జపించుచు కైలాసంబుననుండె.

అమ్మంత్ర ప్రభావంబున అంతకు పూర్వము గంగానదికి స్నానమాడనేగిన కుమారస్వామికి గజాననుండానదిలో స్నానమాడి తనకెదురుగా వచ్చుచున్నట్లుగా గాన్పింప నతండును మూడుకోట్ల ఏబదిలక్షల నదులలో కూడా అటులనే చూచి ఆశ్చర్యపడుచూ కైలాసంబునకేగి తండ్రి సమీపమందున్న గజాననుని గాంచి నమస్కరించి, తన బలమును నిందించుకొని "తండ్రి! అన్నగారి మహిమ తెలియకనట్లంటిని క్షమించుము, ఈ ఆధిపత్యంబు అన్నగారికేయొసంగు"మని ప్రార్థించెను.

అంతనా పరమేశ్వరునిచే భాద్రపద శుద్ధ చతుర్థినాడు గజాననునికి తమ విభవముకొలది కుడుములు, అప్పడములు, మున్నగు పిండివంటలు, టెంకాయలు, పాలు తేనె, అరటిపండ్లు, పానకము, వడపప్పు మొదలగునవి కొన్ని భక్షించుచూ కొన్ని వాహనమున కొసంగియు, కొన్ని చేత ధరించుచూ మందగమనంబున సూర్యాస్తమయవేళకు కైలాసంబునకేగి తల్లిదండ్రులకు ప్రణామంబు సేయబోవ ఉదరము భూమికానిన, చేతులు భూమికందమయ్య, బలవంతంబుగ చేతులానిన చరణంబు లాకాశంబుజూచె. ఇట్లు దండప్రణమంబు సేయ గడు శ్రమనొందుచుండ, శివుని శిరంబున వెలయుచంద్రుడు జూచి వికటంబుగ నవ్వె, అంతరాజదృష్టి సోకి రాలు కూడా నుగ్గగునను సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి, అందున్న కుడుము, తత్ప్రదేశంబెల్లడలం దొర్లెను. అతండును మృత్యుండయ్యె. పార్వతి శోకించుచు చంద్రునిజూచి "పాపాత్ముడా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించెను. గాన నిన్నుజూచినవారు పాపాత్ములై నీలాపనిందలు నొందుదురుగాక"యని శపించెను.

# ఋషిపత్నులకు నీలాపనిందలు కలుగుట



ఆ సమయంబున సప్తమహర్షులు యజ్ఞంబు చేయుచు తమ భార్యలతో ప్రదక్షణము చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషిపత్నులను చూచి మోహించి, శాపభయంబున అశక్తుడై క్షణించుచుండగా నయ్యది అగ్ని భార్యయగు స్వాహాదేవి గ్రహించి

అరుంధతీ రూపము దప్ప తక్కిన ఋషిపత్నుల రూపంబు తానే దాల్చి పతికి ప్రియంబు సేయ ఋషుల ద్దానం గనుగొని అగ్నిదేవునితో నున్నవారు తమ భార్యలే యని శంకించి తమ భార్యలను విడనాడిరి. పార్వతీ శాపాంతరము ఋషిపత్నులు చంద్రుని చూచుటచే వారికట్టి నీలాపనింద కలిగినది. దేవతలను మునులను, ఋషిపత్నులయాపద పరమేష్టికి దెల్పనాతండు సర్వజ్ఞుండగుటచే అగ్నిహోత్రని భార్యయే ఋషిపత్నుల రూపంబుదాల్చి వచ్చుటం దెల్పి సప్త ఋషులను సమాధానపరచె, వారితో కూడా బ్రహ్మ కైలాసంబునకే తెంచి ఉమామహేశ్వరుల సేవించె మృతుడై పడియున్న విఘ్నేశ్వరుని బ్రతికించి ముదంబు గూర్చె. అంత దేవాదులు "ఓ పార్వతీ! నీ శాపంబున లోకంబుకెల్ల కీడు వాటిల్లుచున్నది. దాని నుపహరింపు"మని ప్రార్థింప, పార్వతి సంతసించి ఏ దినంబున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో నాదినంబున చంద్రుని జూడరాదని శాపావకాశంబునొసంగె, అంత బ్రహ్మాదులు సంతసించి తమ గృహంబులకేగి, భాద్రపద శుద్ధ చతుర్థియందు మాత్రము చంద్రుని జూడక, జాగరూకులై సుఖంబుగ నుండిరి.

# శమంతకోపాఖ్యానము

ద్వాపరయుగంబున ద్వారకావాసియగు శ్రీకృష్ణుని నారదుడు దర్శించి, స్తుతించి, ప్రియ



సంభాషణములు జరుపుచూ "స్వామీ! సాయం సమయమయ్యేను. ఈనాడు వినాయక చతుర్థి పార్వతీదేవి శాపంబుచే చంద్రుని జూడరాదు గాన నిజగృహంబునకేగెద శలవిండు" అని పూర్వ వృత్తాంతమంతయు శ్రీ కృష్ణునికి దెల్పి నారదుడు స్వర్గలోకమునకేగెను.

అంత కృష్ణుడు ఆనాటి రాత్రి చంద్రునినెవ్వరూ చూడరాదని పురంబున చాటించెను. నాటి రాత్రి శ్రీ కృష్ణుడు క్షీర ప్రియుండుగాన, తానుమింటి వంక చూడక గోష్టమునకు బోయి పాలుపితుకుచు పాలలో చంద్రుని బింబము చూచి "ఆహా! ఇక నాకెట్టి యపనింద రానున్నదో"యని సంశయముననుండెను. కొన్నాళ్ళకు సత్రాజిత్తు అను రాజు సూర్యవరముచే శమంతకమణిని సంపాదించి ద్వారకా పట్టణమునకు శ్రీకృష్ణ దర్శనార్థమై వచ్చెను. శ్రీ కృష్ణుడాతనిని మర్యాదజేసి "ఆ మణిని మన రాజుకిమ్మ"నెను. అతడది ఎనిమిది బారువుల బంగారం దినంబున కొసగునట్టిది. ఇట్టి మణిని ఏమందమతియైన నివ్వడని, పోనిమ్ముని శ్రీకృష్ణుడూర్కొనెను.



అంతనొకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడా మణిని కంఠమున ధరించి వేటాడనడవికి జనిన నొకసింహ ఆ మణిని మాంసఖండమని భ్రమించి వాని జంపి యామణిని గొనపోవుచుండగా, నొక భల్లూక మాసింగమును దునిమి యా మణిని గొని తన కుమార్తె కాటవస్తువుగా నొసంగెను. మరునాడు సత్రాజిత్తు తమ్ముని మృతి నాలించి 'కృష్ణుడు మణివ్వలేదని నా సోదరుని జంపి రత్నమపహరించె'



నని నగరమున చాటే. కృష్ణుడది విని నాడు క్షీరమున చంద్రబింబమును జూచిన దోషఫలంబని ఎంచి దాని బాపుకొన బంధుసమేతుండై యరణ్యమునకుబోయి వెదకగా, నొక్కచోట ప్రేత కళేబరంబును, సింగపు కాలిజాడలను పిదప భల్లూక చరణ విన్యాసంబును గన్పించెను. ఆ దారిపట్టి బోవుచుండ నొక పర్వత గుహద్వారంజూచి పరివారము నచట విడిచి కృష్ణుండు లోపలికేగి బాలిక ఉయ్యాలపై కట్టబడియున్న మణిని జూచి అచ్చటకిబోయి ఆ మణి చేత పుచ్చుకొని వచ్చుచున్నంత ఉయ్యాలలోని బాలిక యేడ్వదొడగెను. అంత దాదియును వింత మనిషి వచ్చెననుచు కేకలు వేసెను.

అంత జాంబవంతుడు రోషావేశుండై అరుదెంచి శ్రీకృష్ణుని పైబడి అరచుచు నఖంబుల గ్రుచ్చుచు, కోరల గొరుకుచు, ఘోరముగా యుద్ధముజేయ, కృష్ణుడు వానింబడద్రోసి వృక్షముల చేతను, రాళ్ళచేతను, తుదకు ముష్టిఘాతములచేతను రాత్రింబవళ్ళు ఎడతెగక ఇరువదెనిమిది దినంబుల యుద్ధమొనర్చె జాంబవంతుడు క్షీణ బలండై దేహంబెల్ల నొచ్చి భీతిజెందుచు తన బలంబున హరింపజేసి పురుషుండు రావణ సంహారియగు శ్రీ రామచంద్రునిదలంచి, అంజలి ఘటించి "దేవాది దేవా ఆర్తజన రక్షకా! భక్తజన నిన్ను శ్రీరామచంద్రునిగా నెరింగితి, అలకాలాంబున నా యందలి వాత్సల్యముచే నన్ను వరంబు కోరుమని



ఆజ్ఞయోసంగ నా బుద్ధిమాంద్యమున మీతో ద్వందయుద్ధంబు చేయవలెనని కోరుకొంటిని. కాలాంతరమున నది జరుగగలదని సెలవిచ్చితిరి. ఇప్పుడు నా కోరిక నెరవేర్చితిరి, నా శరీరమంతయు శిధిలమయ్యెను. ప్రాణములు కడగట్టె జీవితేచ్ఛ నశించె, నా అపరాధములు క్షమించి కాపాడుమని" ప్రార్థింప శ్రీ కృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయు తన హస్తంబున నిమిరి భయంబుబాపి, "భల్లుకేశ్వరా! శమంతకమణి నపహరించినట్లు నాపై నారోపించిన అపనింద బాపుగోన నిటువచ్చితిని, గాన మణినొసంగుము నేనేగెద"నని దెల్ప జాంబవంతుడు శ్రీకృష్ణుని మణి సహతముగా తన కుమార్తెయగు జాంబవంతని కానుకగా నొసింగెను. అంత తన ఆలస్యమునకు పరితపించు బంధుమిత్ర సైన్యముల కానందంబు కలిగించి కన్యా రత్నముతోను మణితోను శ్రీ కృష్ణుడు పురంబుజేరి సత్రాజిత్తును గావించి పిన్న పెద్దలను జేర్చి యావత్ వృత్తాంమును జెప్పి శమంతకమణి నొసంగి నా సత్రాజిత్తు "అయ్యో! లేనిపోని నింద మోపి దోషంబునకు పాల్పడితి"నని విచారించి మణి సహితముగా తన కుమార్తెయగు సత్యభామ ను భార్యగా సమర్పించి తప్పు క్షమింపమని వేడుకొనెను. శ్రీ కృష్ణుడు సత్యభామనుగైకొని పరిణయమాడనటానికి వచ్చిన దేవాదులు, మునులు స్తుతించి మీరు సమర్థులు కనుక నీలా పనిందబాపు గొంటిరి, మాకేమి గతియని ప్రార్థింప శ్రీ కృష్ణుడు దయాళుడై యధావిధి పూజించి ఈ శమంతకమణి కథను విని అక్షింతలు శిరంబున దాల్చువారు నీలాపనింద నొందకుండెదుగాక" ఆనతీయ, దేవాదులు సంతసించి తమ నివా సంబుల కేగి ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చతుర్థియందు దేవతలు, మహర్షులు, మానవులు, తమతమ విభములకొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధి గాంచుచూ సుఖంబుగా ఉండిరని, శౌనకాది మునులకు సూతుడు వినిపించి వారిని వీడ్కొని నిజాశ్రంబునకు కేగెను.



వినాయక చతుర్థినాడు చంద్రుని చూడరాదు. పొరపాటున చూచినచో విష్ణుపురాణములోని ఈ క్రింది శ్లోకమును చదివినచో ఆ దోషము తొలగిపోవునని నిర్ణయ సింధువులో చెప్పబడినది.

ఆ నాటి నుంచి ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చవితి రోజు దేవతలు, మహర్షులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు తమ శక్తికి తగినట్లుగా గణపతిని పూజించి తమ కోరికలు తీర్చుకుంటున్నారు. ఈ కథను చదివి గాని, విని గాని తల పై అక్షతలను వేసుకొని వినాయక వ్రతాన్ని ముగించాలి.

# శ్రీ వినాయక మంగళ హారతి

శ్రీ శంభుతనయునకు సిద్ధిగణనాథునకు– వాసిగల దేవతావంద్యునకును
ఆ సరసవిద్యలకు ఆదిగురువైనట్టి – భూసురోత్తమ లోకపూజ్యునకును
(జయ మంగళం నిత్య శుభ మంగళం)

నేరేడు మారేడు నెలవంక మామిడి – దూర్వార చెంగల్వ ఉత్తరేణు
వేరువేరుగ దెచ్చి వేడ్కతో పూజింతు – పర్వమున దేవగణపతికి నిపుడు................................(జయ)

సుచిరముగ భాద్రపద శుద్ధచవితి యందు – పొసగ సజ్జనులచే పూజకొల్తు
శశిజూడరాదన్న జేకొంటి నొక వ్రతము – పర్వమున దేవగణపతికి నిపుడు..........................(జయ)

పానకము వడపప్పు పనస మామిడిపండ్లు – దానిమ్మ ఖర్జూర ద్రాక్షపండ్లు
తేనెతో మాగిన తియ్య మామిడిపండ్లు – మాకు బుద్ధినిచ్చు గణపతికి నిపుడు........................(జయ)

ఓ బొజ్జగణపయ్య నీ బంటు నేనయ్య – ఉండ్రాళ్ళ మీదికి దండు పంపు
కమ్మని నెయ్యియు కడుముద్దపప్పును – బొజ్జవిరుగగ దినుచు పొరలుకొనుచు .....................(జయ)

వెండిపళ్ళెరములో వెయివేల ముత్యాలు – కొండలుగ నీలములు కలియబోసి
మెండుగను హారములు మెడనిండ వేసికొని – దండిగా నీకిత్తు ధవళారతి............................(జయ)

పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుగొల్తు – గంధాల నినుగొల్తు కస్తూరినీ
ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తంబున – పర్వమున దేవగణపతికి నిపుడు ................................(జయ)

ఏకదంతంబును ఎల్లగజవదనంబు – బాగయిన తొండంబు వలపు కడుపు
జోకయున మూషికము సొరిదినెక్కాడుచును – భవ్యుడగు దేవగణపతికి నిపుడు....................(జయ)

మంగళము మంగళము మార్తాండతేజునకు – మంగళము సర్వజనవందితునకు
మంగళము ముల్లోక మహితసంచారునకు – మంగళము దేవగణపతికి నిపుడు ...................(జయ)

సిద్ధివిఘ్నేశ్వర ప్రసిద్ధిగా పూజింతు – ఒనరంగ నిరువదియొక్క పత్రి
దానిమ్మ మరువము దర్భ విష్ణుక్రాంత – యుమ్మెత్త దూర్వార యుత్తరేణి.............................(జయ)

కలువలు మారేడు గన్నేరు జిల్లేడు – దేవకాంచన రేగు దేవదారు
జాజి బలురక్కసి జమ్మిదాచెనపువ్వు – గరిక మాచిపత్రి మంచిమొలక ................................(జయ)

అగరు గంధాక్షతల్ ధూప దీప నైవేద్య తాంబూల పుష్పోపహారములును
భాద్రపద శుద్ధచవితిని పగటివేళ కుడుములు నానుబాలు ఉండ్రాళ్ళు పప్పు
పాయసము జున్ను దేనెను పంక్తిమీర కోరిపూజింతు నిన్నెపుడు కోర్కెలలర ..........................(జయ)

బంగారుచెంబుతో గంగోదకముదెచ్చి సంగతిగ శిశువునకు జలకమార్చి
మల్లెపువ్వులు దెచ్చి మురహరుని పూజింతు రంగైన నా ప్రాణాలింగమునకు .........................(జయ)

పట్టుచీరలు మంచి పాడిపంటలుగల్గి గట్టిగా కనకములు కరులు హరులు
ఇష్టసంపదలిచ్చి యేలినస్వామికి పట్టభద్రుని దేవ గణపతికి నిపుడు ...................................(జయ)

ముక్కంటి తనయుడని ముదముతో నేనును చక్కనైన వస్తుసమితి గూర్చి
నిక్కముగ మనమును నీయందె నే నిల్పి ఎక్కువగు పూజలాలింపజేతు................................(జయ)

మల్లెలా మొల్లలా మంచిసంపెంగలా చల్లనైనా గంధసారములను
ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగ నే జేతు కోరి విఘ్నేశ...............................(జయ)

దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యునకు దేవునకును
దేవతలు మిముగొల్చి తెలిసి పూజింతురు భవ్యుడగు దేవగణపతికి నిపుడు............................(జయ)

చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను
పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనెపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను ............................(జయ)

మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు
నేరేడు నెలవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోను ..................................(జయ)

ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచి మమ్మేలుమీ కరుణతోను
మాపాలగలవని మహిమీద నెల్లపుడు కొనియాడుచుందుము కోర్కెదీర ................................(జయ)

*జయ మంగళం నిత్య శుభ మంగళం*

## శ్రీ వినాయక దండకం

శ్రీ పార్వతీపుత్ర లోకత్రయీస్తోత్ర, సత్పుణ్యచారిత్ర, భద్రేభవక్త్రా మహాకాయ, కాత్యాయనీ నాధ సంజాతస్వామి శివాసిద్ధి విఘ్నేశ, నీ పాద పద్మంబులన్, నిదు కంటంబు నీ బొజ్జ నీ మోము నీ మౌలి బాలేందు ఖండంబు నీ నాల్గు హస్తంబు నీ కరలంబు నీ పెద్ద వక్త్రంబు నీ పాద హస్తంబు లంబో దరంబున్ సదమూషకాశ్వంబు నీ మంద హాసంబు నీచిన్న తొండంబు నీ గుజ్జ రూపంబు నీ సూర్పకర్ణంబు నీ నాగ యజ్ఞోపవీతంబు నీ భవ్య రూపంబు దర్శించి హర్షించి సంప్రీతి మ్రొక్కంగ శ్రీ గంధమున్ గుంకుమంబక్ష తాల్జాజులున్ చంపకంబుల్ తగన్ మల్లెలున్మోల్లులు న్మంచి చేమంతులున్ దేల్లగాన్నేరులున్ మంకెనలన్ పోన్నలన్ పువ్వులు న్మంచి దూర్వంబులన్ దెచ్చి శాస్త్రోక్తరీతిన్ సమర్పించి పూజించి సాష్టాంగముంచేసి విఘ్నేశ్వరా నీకుతేంకాయ పోన్నంటిపండ్లున్ మటిన్మంచివౌ నిక్షుఖండంబులన్ రేగుబండ్లప్పడాల్ వడల్ నేయిబూరెల్ మరిన్ గోదుమప్పంబులు న్వడల్ పునుగులున్బూరేలున్ న్గారెలున్ చొక్కమౌ చల్మిడిన్ బెల్లమున్ దేనెయుంజున్ను బాలాజ్యము న్నాను బియ్యంచామ్రంబు బిల్వంబు మేల్ బంగురున్ బల్లెమందుంచి నైవేద్య బంచనీరానంబున్ నమస్కారముల్ చేసి విఘ్నేశ్వరా! నిన్ను బూజింపకే యన్యదైవంబులం బ్రార్ధనల సేయుటల్ కాంచనం బోల్లకే యిన్ము దాగోరు చందంబుగాదే మహాదేవ ! యోభక్తమందార ! యోసుందరాకారా ! యోభాగ్య గంభీర ! యోదేవ చూడామణీ లోక రక్షా మణీ ! బందు చింతామణీ ! స్వామీ నిన్నెంచ, నేనంత నీ దాసదాసాది దాసుండ శ్రీ దొంతరాజాన్వ వాయుండ రామాబిధానుండ నన్నిప్డు చేపట్టి సుశ్రేయునించేసి శ్రీమంతుగన్ జూచి హృత్పద్మ సింహాసనారూడతన్ నిల్పి కాపాడుటేకాదు విన్గోల్చి ప్రార్ధించు భక్తాళికిన్ గోంగు బంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియున్ విద్యయున్ పాడియున్ బుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ కల్గగాజేసి పోషించు మంటిన్ గృహన్ గావుమంటిన్ మహాత్మా యివే వందనంబుల్ శ్రీ గణేశా ! నమస్తే నమస్తే నమస్తే నమః ॥

*ఇతి శ్రీ వినాయక దండకం॥*

**క్షమా ప్రార్ధన :** యస్య స్మృత్యా చ నామోక్త్యా తప: పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే గజాననం ॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

**ఉద్వాసన మంత్రం** ఓం యన యమయజంత దేవాః । తాని ధర్మాణి ప్రధమాన్యాసన్ ॥
తే హ నాకం మహిమానః సచంతే । యాత్ర పూర్వే సాధ్యాః సంతిదేవా: ॥
ఓం శ్రీ మహా గణపతయే నమః యథాస్థానం ఉద్వాసయామి ॥
శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ ॥

*అని చెప్పి, పీట పై ఉన్న గణపతిని ఒకసారి కొంచెం ఎత్తి అక్కడే ఉంచాలి.*

*సర్వేజనాః స్సుఖినో భవంతు*

# హిందూ ధర్మం గురించి చెప్పుకోవాలంటే...

1. భగవంతుడు లేదని చెప్పినా, మత ద్రోహిగా పరిగణించని ధర్మం, హిందూధర్మం.
2. రోజుకు ఇన్ని సార్లు, వారానికి ఇన్ని సార్లు, నెలకు ఇన్ని సార్లు తప్పనిసరిగా గుడికి వెళ్ళే తీరాలనే నిబంధనలు పెట్టని ధర్మం, హిందూధర్మం.
3. జీవిత కాలంలో కాశికో లేక రామేశ్వరానికో తప్పనిసరిగా ఒక్క సారి వెళ్ళే తీరాలనే నిబంధనలు పెట్టని ధర్మం, హిందూధర్మం.
4. హిందూ మత గ్రంథాల ప్రకారమే జీవనాన్ని కొనసాగించాలనే నిబంధనలు పెట్టని ధర్మం, హిందూధర్మం.
5. హిందూ మతానికి ప్రత్యేకమైన మతపెద్ద అంటూ ఎవరూ ఉండరు.
6. సన్యాసులు, స్వామీజీలు, మఠాధిపతులు తప్పులు చేసినా, నిలదీసి, ప్రశ్నించే ధర్మం, హిందూధర్మం.
7. హిందువులు ఈ క్రింది వాటిని కూడా భగవత్సరూపాలుగానే ఆరాధిస్తారు.
   - వృక్షాలు దైవ స్వరూపాలే.
   - రాళ్ళూ – రప్పలూ కూడా దైవస్వరూపాలే.
   - నీరు (గంగ) కూడా దైవ సవరూపమే.
   - గాలి కూడా దైవ స్వరూపమే.
   - వానరాలు (కోతులు) కూడా దైవ స్వరూపాలే.
   - కుక్కలు (భైరవుడు) కూడా దైవ స్వరూపాలే.
   - పందులు (వరాహం) కూడా దైవ స్వరూపాలే.
8. నువ్వూ దైవ స్వరూపమే. • నేనూ దైవ స్వరూపమే.
   - చక్షు గోచరమైనవన్నీ (కంటికి కనిపించేవన్నీ) దైవ స్వరూపాలే.
9. చతుర్వేదాలు, నాలుగు ఉప వేదాలు, రెండు ఇతిహాసాలు, పద్దెనిమిది పురాణాలు, పద్దెనిమిది ఉప పురాణాలు, ఆరు శాస్త్రాలు, పద్దెనిమిది స్మృతులతో పాటు 1200 వందలకు పైగా ధార్మిక గ్రంథాలు గల సువిశాల ధర్మం, హిందూధర్మం.

## దైవం మానుష రూపేణ అంటే ఏమిటి ?

దైవం మానుష రూపేణ'.. అంటే దైవం ఎక్కడో లేరు.. 'మనిషి' రూపంలో మన దగ్గరే ఉన్నారని అర్థం.
మరి ఆ దైవస్వరూపం ఎవరు అంటే... మనల్ని నవమాసాలు మోసి, జన్మనిచ్చిన 'తల్లి'
రెండోది ఈ భౌతిక శరీరధారణకు కారణమైన 'తండ్రి'
మూడోది మన చుట్టూ ఆవరించి ఉన్న అజ్ఞానమనే చీకట్లు తొలగించే 'గురువు'
నాలుగోది సేవకు అవకాశం కల్పించిన భగవత్ స్వరూపం...అతిథి.
అందుకే... మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ అని మన సనాతన ధర్మం తెలియ జేస్తుంది.

**మాతృదేవోభవ..** ఈ ఇలలో తల్లిని మించిన దైవం లేదు అన్న ప్రాథమిక సత్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి. అవతారమూర్తి ఐన ఓ అమ్మకు బిడ్డే కదా నీవు... అసలు ఈ భూమ్మీది అద్భుతం ఏదైనా ఉంది అంటే అది 'నువ్వే'...... మరి అలాంటి అద్భుతాన్ని సృష్టించిన తల్లికి మించిన వేరే దైవం ఏముంది. తన రక్త మాంసాలతో మనిషిని సృష్టించి, కంటికిరెప్పలా కాపాడుతూ పెంచి, పోషించి, ప్రయోజకుణ్ని చేయడంలో ప్రతి మనిషి జీవితంలో తల్లి పాత్ర సుస్పష్టం. మరి అలాంటి మాతృమూర్తి పట్ల వృద్ధాప్యంలో మనం ఎలా వ్యవహరిస్తున్నాం? ఆమెకు మనం ఏం ఇచ్చి రుణం తీర్చుకోగలం? తనకు స్వాంతన కలిగించడం, అమర్యాదగా ప్రవర్తించకపోవడమే తల్లి రుణం తీర్చుకోవడం. ఆమెన గౌరవించడమే తల్లికి అగ్రతాంబూలం..!

**పితృదేవోభవ..** తల్లి.. తండ్రి.. ప్రతి వ్యక్తికి రెండు కళ్లు. నిరాకార భగవంతుడికి సాకార ప్రత్యక్షమే తండ్రి. మన ఎదుగుదలకు అనుక్షణం ఆరాటపడి, జీవితంలో ప్రతిక్షణం పోరాడుతూ మన ఉన్నతికి బాటలు వేసిన అలుపెరుగని యోధుడు. సమసమాజంలో మనకోసం గౌరవం, బాధ్యత, కర్తవ్యం, భద్రత, కీర్తి, వంశం, ప్రతిష్ఠ మొదలైన పదాలకు స్వరూపం. అందుకే ఓ మహానుభావుడు తల్లిదండ్రుల గురించి ఇలా అన్నాడు.. 'ఒకరికి చేతులు జోడించి నమస్కారం పెడుతున్నామంటే ఆ వ్యక్తి ఆస్థాయికి ఎదగడానికి కారణం అయిన తన తల్లిదండ్రులకు మొదట నమస్కారం పెట్టాలి'... తల్లిదండ్రులను గౌరవించడమే

అసలైన ఆధ్యాత్మికత. మరణించిన తర్వాత వారికి విగ్రహాలు నిర్మించడం, ఫోటోలకు దండలు వేయడం, కర్మకాండలు ఆడంబరంగా నిర్వహించడం కాదు. వారు జీవించిగానే తోడుగా, నీడగా ఉండటమే అసలైన ధర్మం..!

**ఆచార్య దేవోభవ..** ఏ మాత్రం రక్త సంబంధం లేకపోయినా పై లోకాల నుంచి దిగివచ్చి మన ఉన్నతికి పాటుపడి గొప్ప జ్ఞానవంతులుగా తీర్చిదిద్దడానికి కంకణం కట్టుకున్న అపర భగవంతుడే ఆచార్యుడు. ఇహ, పర జ్ఞానాన్ని మనకు ప్రసాదించి జన్మను సార్థకం చేసుకునే మహాభాగ్యాన్ని అందించిన గురువుకు సదా కృతజ్ఞుడై ఉండడమే 'ఆచార్య దేవోభవ'.

**అతిథి దేవోభవ..** మనకు తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిన సంస్కారాన్ని, గురువు ద్వారా లభించిన జ్ఞానాన్ని సద్వినియోగం చేసుకుని, విశేష సేవకి అవకాశం కల్పించిన మహాత్ముడే 'అతిథి'. 'పంచుకుంటే పెంచబడుతుంది' అన్నది పరమసత్యం. అతిథి సేవ ద్వారానే మన జీవితం ప్రస్ఫుటమవుతుంది. ఎవరికైనా సేవచేసే అవకాశం లభిస్తే.. సాక్షాత్తు ఆ భగవంతుడికి సేవ చేసునట్టే.. అందుకే 'మానవ సేవయే మాధవ సేవ' అంటారు. ఇలా సేవకు అవకాశం కల్పించిన తోటి మిత్రులే అతిథి దేవళ్లు.

మానవుడిగా జన్మించి ధ్యానసాధన, అహింస మార్గంలో ఎవరైతే ఉంటారో వారు మాత, పితృల రుణం తీర్చుకున్నవారు అవుతారు. గురువు చేసే ధ్యాన, జ్ఞాన ప్రచారంలో సారధులయ్యే వారు , గురు రుణం తీర్చుకున్నవారు అవుతారు. ప్రతి ఒక్కరికీ సేవచేస్తూ అందరిలోనూ భగవత్ స్వరూపాన్ని దర్శించుకునే వారు అతిథి రుణం తీర్చుకున్నవారు అవుతారు.

అంతేకాదు తన జన్మకు అర్థం, పరమార్థం సాధించుకున్నవారుగా..ఆచంద్రార్కం ఆనందంతో జీవిస్తారు! ఇదీ మన సనాతన సంప్రదాయం

## ధర్మమే గెలుస్తుంది' అని అందరూ అంటుంటారు ... అది తప్పు...

ధర్మం దానంతట అదే గెలవదు గెలిపించాలి... నువ్వు గెలిపించాలి, మనం కలిసి గెలిపించాలి. అర్థం కాలేదా...?

**కృత యుగం:** తన భక్తుడైన ప్రహ్లాదున్ని కాపాడడానికి ధర్మ సంస్థాపనకు భక్తుడి కోసం భగవంతుడు ఉన్నాడు అని చెప్పడం కోసం, సత్యాన్ని స్థాపించడం కోసం అణువు అణువు లో భగవంతుడు నృసింహ రూపంలో వ్యాపించి అహోబిల క్షేత్రం లో ఒక స్తంభం నుండి వచ్చాడు . హిరణ్య కశ్యపుడిని సంహరించాడు.

**త్రేతాయుగం :** భార్యను రావణాసురుడు ఎత్తుకెళ్ళాడు, సరేలే ధర్మమే గెలుస్తుంది కదా, తన సీత తిరిగి వస్తుంది అని రాముడు చేతులు కట్టుకొని గుమ్మం వైపు చూస్తూ రాముడి కూర్చోలేదు. రావణాసురుడి మీదా ధర్మయుద్ధం ప్రకటించాడు. ఆ రాముడికి అఖండ వానరసైన్యం తోడై ధర్మం వైపుకు అడుగులు వేశారు, ఆ యుద్ధంలో రాముడికి సైతం గాయాలు అయ్యాయి. తన భుజాలను, తొడ భాగాల చర్మాన్ని బాణాలు చీల్చుకొని వెళ్ళాయి. నరాలు తెగి, రక్తం చిందుతున్న సరే తట్టుకొని నిలబడ్డాడు, పోరాడాడు. యద్ధంలో గెలిచాడు... ధర్మం గెలిచింది..!

**ద్వాపరయగం:** కురుక్షేత్రం యుద్ధంలో కృష్ణుడు తను దేవుడు కదా అని ఒక ప్రేక్షకుడిలా యుద్ధాన్ని చూడలేదు.. ధర్మం చూసుకున్నాడు పాండవుల పక్షాన నిలుచున్నాడు అర్జునుడికి రథ సారథిగా మారాడు, అబద్ధం ఆడాడు, చివరకు మోసానికి మోసమే చేసాడు... అవన్ని ధర్మం కోసమే చేసాడు, ధర్మాన్ని గెలిపించడం కోసమే చేసాడు. అలా కురుక్షేత్ర యద్ధం ముగిసింది, ధర్మం గెలిచింది...!

ధర్మాన్ని, సత్యాన్ని స్థాపించడం కోసం భగవంతుడే ఎన్నో రూపాలు ధరించి, కష్టాలు పడితేనే ధర్మం గెలిచింది...!

**కలియుగం :** ఇప్పుడు కూడా మనం ప్రతిరోజు ధర్మం కోసం, సమస్యలతో పోరాడుతునే వున్నాం.. ప్రతి ఒక్కరి మదిలో మంచికి చెడుకి యుద్ధం జరుగుతునే వుంది.. నువ్వు నా, ని, తన, మన భేదాలను పక్కన పెట్టి ఆలోచిస్తేనే ధర్మం అర్థం అవుతుంది.. అలా అలోచించి, హిందూ పార్టీలకి ఓటు వేసిన రోజే, హిందూ ప్రభుత్వం వస్తుంది... హిందూ ధర్మం గెలుస్తుంది.. అలా ధర్మం వైపుకు నిలబడిన రోజు నీ వెనకాలా ప్రపంచమే నడుస్తుంది. . !

**ధర్మో రక్షతి రక్షిత.**

# తెలుగు భాషలోని వాగ్దేవతలు వారి అద్భుత శక్తులు

**తెలుగు భాషలో వాగ్దేవతల యొక్క వర్ణమాల దాని అంతర్నిర్మాణం :**

"అ నుండి అః" వరకు ఉన్న 16 అక్షరాల విభాగాన్ని "చంద్ర ఖండం" అంటారు. ఈ చంద్రఖండంలోని అచ్చులైన 16 వర్ణాలకు అధిదేవత "వశిని" అంటే వశపరచుకొనే శక్తి కలది అర్థం.

"క" నుండి "భ" వరకు ఉన్న 24 అక్షరాల విభాగాన్ని " సౌర ఖండం " అంటారు. "మ" నుండి "క్ష" వరకు ఉన్న 10 వర్ణాల విభాగాన్ని " అగ్ని ఖండం" అంటారు. ఈ బీజ శబ్దాలన్నీ జన్యు నిర్మాణాన్ని క్రోమౌజోములను ప్రభావితం చేయగలుగుతాయి.

సౌర ఖండంలోని " క "నుండి "ఙ" వరకు గల ఐదు అక్షరాల అధిదేవత కామేశ్వరి. అంటే కోర్కెలను మేలుకొలిపేది అని అర్థం.

"చ" నుండి "ఞ" వరకు గల ఐదు వర్ణాలకు అధిదేవత "మోదిని" అంటే సంతోషాన్ని వ్యక్తం చేసేది. "ట" నుండి "ణ" వరకు గల ఐదు అక్షరాల అధిదేవతా శక్తి "విమల". అంటే మలినాలను తొలగించే దేవత.

"త" నుండి "న" వరకు గల ఐదు అక్షరాలకు అధిదేవత "అరుణ" కరుణను మేలుకొలిపేదే అరుణ.

"ప" నుండి "మ" అనే ఐదు అక్షరాలకు అధిదేవత "జయని". జయమును కలుగ చేయునది.

అలాగే అగ్ని ఖండంలోని " య, ర,ల, వ అనే అక్షరాలకు అధిష్టాన దేవత " సర్వేశ్వరి". శాశించే శక్తి కలది సర్వేశ్వరి.

ఆఖరులోని ఐదు అక్షరాలైన "శ, ష, స, హ, క్ష లకు అధిదేవత "కౌలిని"

ఈ అధిదేవతలనందరినీ "వాగ్దేవతలు" అంటారు. అయితే ఈ ఏడుగురే కాకుండా అన్ని వర్ణాలకు ప్రకృతిలో ఒక రూపం, ఒక దేవతాశక్తి ఉంది. ఎందుకంటే శబ్దం బ్రహ్మ నుండి అద్భవించింది. అంటే బ్రహ్మమే శబ్దము. ఆ బ్రహ్మమే నాదము.

మనం నిత్యజీవితంలో సంభాషించేటప్పుడు వెలువడే శబ్దాలు మనపై, ప్రకృతి పై ప్రభావం చూపుతాయి. అదే మంత్రాలు, వేదం అయితే ఇంకా లోతుగా ప్రభావం చూపుతుంది. భూమి మీద పుట్టిన ప్రతి జీవి ఈ శబ్దాల్ని ఉచ్చరించి అమ్మవార్లును అర్చిస్తున్నాయి.

కాబట్టి మనం స్తోత్రం చదువుతున్నా, వేద మంత్రాలు, సూక్తులు వింటున్నా మనం ఈ విషయం స్ఫురణలో ఉంచుకుంటే అద్భుతాలను చూడవచ్చు. మనం చదివే స్తోత్రం ఎక్కడో వున్న దేవుడిని/దేవతను ఉద్దేశించి కాదు, మనం చదివే స్తోత్రమే ఆ దేవత. మనం చేసే శబ్దమే ఆ దేవత. మన అంతఃచ్చేతనలో ఉండి పలికిస్తున్న శక్తియే మన ఉపాస్య దేవత. ఆ శబ్దం వలన పుట్టిన నాదం దేవత. ఎంత అద్భుతం. ఇది మన తెలుగు వైభవం.ఇది సనాతన ధర్మం. ఇది మనకు మాత్రమే పరిమితమైన అపూర్వ సిద్ధాంతం.

*ఈ వినాయక వ్రతకల్ప కూర్పునకు సహాయ సహకారములు అందించినవారు*

ధార్మిక , సామాజిక రంగాలకు సేవలు అందిస్తున్నవారు

**శ్రీ ఇసుకపల్లి సత్యమూర్తి గారు** ఎస్.డి.ఇ., బిఎస్ఎన్ఎల్, రిటైర్డ్.
మొబైల్ నెంబర్: 94401 75488.

## వినాయకుని గురించి నేర్చుకోవాల్సిన నీతి వాఖ్యాలు :

**పెద్ద తల** పెద్దగా ఆలోచించి సరైన నిర్ణయాలను తీసుకోవడానికి సూచన.

**చిన్న కళ్లు** అన్ని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించడానికి సూచన.

**చిన్న నోరు** అవసరానికి తగినంత మాట్లాడడానికి సూచన.

**పెద్ద చెవులు** అన్ని మాటలను వినండి, అనవసరమైన వాటిని విస్మరించండి.

**విరిగిన దంతం** వ్యతిరేకతలను అధిగమించండి.

**పెద్ద పొట్ట** మంచి మరియు చెడు అన్ని విషయాలను జీర్ణించుకోవడానికి.

**లడ్డూలు** విజయానికి బహుమతి.

**చిన్న మూషికం** మనకున్న కోరికలకు చిహ్నం. కోరికలను మనం నడిపించాలి కానీ కోరికలు మనల్ని నడిపించకూడదు.

**అభయ ముద్ర** అందరిని బుద్ధి, ఆశ్రయం మరియు రక్షణ ఉండేలా అనుగ్రహించడం.

**ఒక కాలు ముడుచుకొని మరియు నేలపై ఒక కాలు**
ప్రపంచాన్ని మరియు దాని ఆనందాలను అనుభవిస్తున్నప్పుడు, నిర్లిప్తంగా ఉండాలి మరియు నిరంతరం తన అంతరంగాన్ని వెతకాలి.

**హిందూతత్వం, దేశభక్తి, ఇతర గ్రంధాల్లోని మంచి చెడులను గురించి తెలియాలంటే**
**ఈ క్రింది 'లింక్'లను వీక్షించండి. నిజం తెలుసుకో... నీ ధర్మాన్ని నమ్ముకో**


హైందవశక్తి కృష్ణా


శివశక్తి


హిందూ జనశక్తి


అభిమన్యసేన


గోపీ సుదర్శన చక్రం


రాధామనోహర్ దాస్


హమారా ప్రసాద్


మోక్షజ్ఞ గీత


తెలుగు –Ex క్రిస్టియన్


ఆర్.జె.కిరణ్


నేషనల్ హబ్


స్టింగ్ తెలుగు


భరత్‌వర్ష


రిఫ్లెక్షన్


నారద న్యూస్


గరికపాటి వారు


చాగంటి వారు


నందూరి వారు


ప్రవీణ్ మోహన్ వారు



# గాయత్రి నిర్మాణ్



మీ స్థలముల డెవలప్‌మెంట్ కొరకు మరియు
ఇండిపెండెంట్ హౌసెస్, అపార్ట్‌మెంట్స్, గోడౌన్స్ మొ॥ కాంట్రాక్ట్ పద్ధతిపై
అత్యంత నాణ్యమైన మెటీరియల్‌తో సకాలంలో కట్టబడును.
నమ్మకంతో రండి! సంతోషాలను పంచుకోండి!!

**7842 288882, 8885 288882**

## SR రియల్ ఎస్టేట్స్

పొలములు, ఇళ్ళు, ఇళ్ళ స్థలములు
అమ్మదలచినా, కొనదలచినా

**9491246155, 9030306222**

NARENDRA.B
98 4888 2 108



## NARENDRA NATURAL MART

6th Lane, KL Rao Nagar
Chittinagar, Vijayawada-9

**ORGANICS**
- PULSES
- OILS
- RICE
- MILLETS
- JAGGERY

**SNACKS**
- MILLET SNACKS
- JAGGERY SNACKS
- NATURAL SNACKS
- ROASTED SEED SNACKS



FREE HOME DELIVERY

SREE
# PRATHYUSHA
SUPER SPECIALITY HOSPITALS

*Nurturing mom & baby*
AT EVERY STAGE





## Centres of Excellence :

- High Risk Pregnancy
- Priority For Normal Delivery
- Painless (Epidural) Delivery & VBAC
- Laparoscopic Surgery - State of the Art Technology

**OBSTETRICS GYNAECOLOGY FERTILITY FETAL MEDICINE NEONATOLOGY**

## Luxury Delivery
At Sree Prathyusha, Every Delivery is Safe

- Luxury Delivery Suites
- Exquisite Rooms
- Gift Shop
- Epidural Delivery
- Modern Technology
- Free Wi-fi



**Dr.Jasthi Prathyusha**
MBBS, MS(OBG).
Masters in reproductive medicine(U.K)
FMAS( fellowship in minimal access surgery)
DMAS( diploma in minimal access surgery)
REG NO:-APMC/FMR/79099



**Hospital**
#29-28-71, Dasarivari Street, Suryaraopet, Vijayawada-520002
8608-95-8608

**Clinic**
#6-24, First Floor, NTR Statue, Guntupalli, Vijayawada - 521241
8608-93-8608

pratyushahospital@gmail.com

Scan this QR code to view website



www.sreeprathyushahospitals.in prathyushahospital@gmail.com

సర్వేజనాః స్సుఖినో భవంతు